Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ నవంబరు నెల 14 వ తేది శుక్రవారం [నె 35 రు

## భారతీయ సేనలు.

### మధ్య ప్రాచ్యమునందు ప్రతిభావంతముగ పోరుట.

### ఇండియాకు యుద్ధంరాకుండా చేస్తున్నవి.

"భారతీయ సేనలు స్వదేశం విడచి ఎంతో దూరంలో పనిచేయుచున్నవి. అయినను అచట ఇండియాయొక్క యుద్ధములందే పాల్గొనుచున్నారు. వారి నేర్పు ధైర్యములతో యుద్ధం ఇండియాకు రాకుండా కాపాడుచున్నారు."

అని భారతీయ ప్రధాన సేనానాయకుడు సర్ ఆర్చిబాల్డు వావెలుగారు ఇండియా స్టేటు కౌన్సిలు సభయందు ఒక ప్రశ్నకు ప్రత్యుత్తరంగా చెప్పిరి. ఆఫ్రికా చేరువ వివిధ దేశములలో ఇండియా సైనికులు ఎట్లు యుద్ధముచేసి కీర్తి గడించిరో, తానచట సేనానాయకుడుగనుండి వారి నెట్లు నడపించిరో వివరంగా తెలిపిరి. ఈజిప్టు పడమర ఎడారిలో ఇటలీ సేనను నిర్మూలం చేసినది ఇండియానుండి వచ్చిన సేనలే. ఈ సేనలే ఇటలీవారి తూర్పు ఆఫ్రికా సామ్రాజ్యమునుకూడ నాశనం చేసినవి.

"ఇటలీ సామ్రాజ్యములోనిదగు ఇరిట్రియా ముఖ్య పట్నమగు కరేను ముట్టడి భారతీయ సైనిక చరిత్రయందు చిరకాలం జ్ఞాపకముండగల ఘట్టము."

"కరేను పతనంతో ఇటలీ సైన్యాల నిరోధం తగ్గింది. 5 వ డివిజను భారతీయ సైన్యం తక్కిన ఇరిట్రియా నగరాలగు అస్మరా, మసావాలను రాష్ట్రమంతను ఏప్రిలు మొదటి వారంలోగా వశపరచుకొనెను. దానితో ఎర్ర సముద్రమునందు మనకు మార్గ నిరోధం తొలగిపోయింది. తరువాత 5 వ డివిజను ఇండియను సేన అబిసీనియా లోనికి చొచ్చుకొనిపోయి యుద్ధం కొనసాగించుసరికి అచట ఇటలీ వైస్రాయియగు అయోస్టా ప్రభువు యీ డివిజను సేనానాయకునకు లొంగిపోయెను. జనవరినుండి మేమాసంలోగా నాల్గు నెలల యుద్ధంలో భారతీయ 4, 5 డివిజనుల సైనికులు ఇరిట్రియా అంతను అబిసీనియా ఉత్తర భాగమును తీసుకోగల్గిరి. ఇది చాల ప్రశంసార్హమగుపని. రాజుగారు భారతీయ సైనిక లిరువురకు రెండు విక్టోరియా క్రాసు బిరుదులొసంగి వారి ధైర్యసాహసములను కొనియాడుట ఎంతో తగియున్నది.

### విశ్రాంతి లేదు.

"ఇతరచోట్ల యుద్ధం యీ భారతీయ సేనకు విశ్రామం లేకుండా చేసింది. వారాక్రమించిన ఇరిట్రియాదేశాన్ని భారత సంస్థాన సేనల కాపలాక్రిందయుంచి, వారిని ఈజిప్టునకు పంపవలసివచ్చింది. 1940 వ సం॥ అక్టోబరు ఆఖరున ఇటలీసైన్యం గ్రీసుపై దాడి చేసెను. గ్రీకులే ఆదాడిని నిరోధించుకొనిరి. కాని 1941 వ సం॥లో బల్గేరియా మీదుగ గ్రీసుపై యింకో వైపునుండి జర్మనులు దాడి చేస్తున్నారని తెలిసింది. అందుచే మధ్యప్రాచ్యమునందున్న సుశిక్షితమగు సైన్యం అంతా అక్కడికి పంపవలసివచ్చింది. సిరినైకాలో గెల్చినభాగాల కాపలాకు కొద్దిపాటి సైన్యం, ఆయుధసంపద అట్టే లేనిది, ఉంచవలసివచ్చింది. ఇక్కడో పొరబాటు జరిగింది. తిరిగి ఏప్రిలులోగా సిరనైకాలో శత్రుదాడి యుండదని యీలోగా ఇటాలియను తూర్పు ఆఫ్రికానుండి తరఫీదయిన భారతీయ సైన్యం సిరనైకా రాగలదని అనుకొంటిమి. కాని అచట శత్రుదాడి అనుకున్న దానికంటే ఒక నెల ముందుగనే వచ్చెను. అంతకుముందు నెలరోజుల క్రిందటే ఆప్రాంతాలు చేరిన ఇండియను మోటారు బ్రిగేడువారు శత్రుసేనను చాల ధైర్యముతో ఎదిరించిరి. తమకన్న ఎక్కువ సేన చుట్టివేసినను, టాంకులు మరఫిరంగులు శత్రువులకు ఎక్కువగానున్నను, 48 గంటలు మెచిలి నగరమునందు యీ భారతీయ సైనికులు శత్రువును నిరోధించి, శత్రుసేనలను చీలదీసి తప్పించుక పోగల్గిరి. వీరిలో ఒక రెజిమెంటు సైనికులు టోబ్రూకు రక్షణయందు ఐదు నెలలు పాల్గొనివచ్చినవారు. ఈ రెజిమెంటు సైనికులు 200 మంది శత్రుసైనికులను తుపాకి సన్నీలతో పొడిచిరి.

### ఇరాకు, సిరియాలలో.

"గ్రీసు క్రీటు రక్షణలయందు కొద్దిమంది భారతీయ టెక్నిషియనులు (నేర్పరులగు పనివారు) తప్ప భారతీయ సేనలేవి పాల్గొనలేదు. కాని ఏప్రిలు మాసంలో ఇండియా రక్షణకు ఎక్కువ అవసరమగు ఇరాకు యుద్ధంలో మాత్రం భారతీయ సేనలు పాల్గొన్నవి. అచట రషీదాలియను జర్మను పక్షపాతి, సైన్యం సహాయంతో ఇరాకుపాలకులను త్రోసివేసి రాజ్యాధికారం వహించెను. అందుచే మన భద్రతకోసరం ఏప్రిలులో భారతీయసేన ఇరాకు రేవగు బాస్రాలో దిగవలసివచ్చెను. ఇంకొక నెలకు ఇంకో సైనిక దళంకూడ చేరెను. రషీదాలి హబనాయలో బ్రిటిషువారి విమానాశ్రయాలపై దాడిచేసెను. కాని సకాలమున జర్మను సేనల సహాయం అతనికి చేరలేదు. జర్మనులకు సహాయం చేయడం యిష్టంలేదో, చేత కాలేదో మరి, రషీదాలీ మాత్రం తనదేశీయులు ఎక్కువమంది ప్రతికూలంగా వుండుట చేతను, ముఖ్యపట్నమగు బాగ్దాదునకుగూడ చిన్న బ్రిటిషు సేన రాగానే, దేశం విడచి పారిపోయెను. బాగ్దాదులో సక్రమప్రభుత్వం స్థాపించబడెను. బాస్రాలో చేరిన గూర్ఖా బెటాలియనులో కొంతభాగం విమానాలమీద హబనాయ పంపబడగా, అచట విమానాశ్రయమును రక్షింపగల్గెను. తక్కిన భారతీయసేన బాస్రానుండి దేశంలోకి ప్రయాణమై దేశంలో అరాచకం అణచి, శాంతిచేకూర్చి ప్రజలతో చాల మంచిగా యిప్పటికిని అక్కడనేయున్నది. "సిరియా దేశంలో పాలకులగు విషీప్రభుత్వం అనుమతిపై జర్మనులనేకులు చేర ఇరాకులోని తిరుగుబాటుదారులగు రషీదాలి ముఠాకు సహాయం చేయుచుండిరి. ఈ దేశంలో సర్వాధికారం జర్మనులు వశంచేసుకోవాలని చూస్తూవుండిరి. అందుచే సైన్యం చాలకపోయినా వెంటనే చర్యతీసుకోవలసి వచ్చింది. నాలుగవ భారతీయ డివిజను యిచట చాల ఘన

కార్యములు చేసెను. డామస్కసు నగర పతనం యీ సైనికదళం ప్రతిభాఫలితమే. ఇరాకునుండి కూడ భారతీయ సైనికదళాలు సిరియావచ్చి యుద్ధంలో పాల్గొన్నాయి.

### పర్షియాలో.

"పర్షియాలోగూడ జర్మనులు ప్రవేశించి మనకు నష్టం కలిగించాలని ప్రయత్నం చేశారు. ఇండియాకు పర్షియా చేరువగుటచే ఇండియాకెంతో యిందువలన ప్రమాదం కలదు. పర్షియా ప్రభుత్వానికి ఎంత విన్నవించినా లాభం లేకపోయింది. పర్షియానుంచే చమురువస్తున్నది. కావున మన చమురు సరఫరా నిలచిపోకుండా ఉండుటకును, ఇండియా భద్రత కొరకును ఆగస్టు మాసంలో బ్రిటిషుసేనయు భారతీయసేనయును పర్షియా ప్రవేశించినవి. ఉత్తరంనుండి రష్యాసేన కూడ వచ్చెను. ఈ చర్యలు అతివడిగా జరుగుటచే అట్టే నిరోధంలేక కొద్ది రోజులలోనే, అట్టే నష్టం లేకుండా యుద్ధం ముగిసింది. ఇరానులో క్రొత్త ప్రభుత్వవర్గ మేర్పడినది. అది మన సేనకు సహకారిగావుంది.

"ఇటలోగా ఈజిప్టు సరిహద్దువద్ద పడమటి ఎడారిలోను భారతీయసేనలు యుద్ధంచేస్తునే వున్నాయి. ఈ సైనికులు వారి సహజ ధైర్యసాహసములతో శత్రువునకు ఎక్కువ నష్టం కలిగించిరి. ఈజిప్టుపై దాడి జరుగకుండా వీరు కాపాడిరి."

అని సేనాని సర్ ఆర్చిబాల్డు వావెలుగారు తెలిపిరి. త్వరలో యీ భారతీయ సైనికుల చర్యలన్ని తెలిపే ఒక పుస్తకం ప్రకటిస్తామనికూడ అన్నారు.

---

# భారత దేశంలో ఆయుధ నిర్మాణం.

## స్వయం సమృద్ధి చేయడానికి ప్రయత్నాలు.

యుద్ధం ఆరంభమైనప్పటి నుండి భారత దేశం ఆయుధ నిర్మాణం విషయంలో సాధించిన అభివృద్ధి ప్రతివారికీ ఆశ్చర్యం కల్గిస్తుంది.

నేటి కాలంలో యుద్ధమంటే, అనేక రకములగు ఆయుధాలు, యంత్రాలు, అసంఖ్యాకములగు ఇతర పరికరాలు అవసరం. వానిలో యేవి లేకపోయినాచిక్కుగానే వుంటుంది. ఇటీవల వీనిని లెక్కింపగా, 60 వేల రకముల వస్తుసామగ్రియుంటేనేగాని, నేటి కాలంలో యుద్ధ పరికరాలు పూర్తికావని వెల్లడి అయింది.

పై 60 వేల రకముల వస్తు సామగ్రిలో అత్యధిక భాగం, ఆయుధాలకు సంబంధించిన పరికరములు, సైనికులకు కావలసిన ఉక్కు కప్పులుగల ఫిరంగి మోటారులు, టాంకులు, విమానములు నౌకలు మొదలైనవి. వీనిలో కొన్ని ఇదివరకే ఈ దేశంలో, ప్రభుత్వంవారి ఆయుధ నిర్మాణ శాలలలో తయారగుచున్నాయి. మరికొన్ని ఇతర కర్మాగారాలలో తయారగుచుండేవి. యుద్ధం ప్రారంభం కాగానే, ప్రభుత్వంవారి ఆయుధ నిర్మాణ శాలలను చాల విస్తరింప చేశారు. రైల్వేలు మొదలగు వందల కొలది ప్రైవేటు కర్మాగారాలలో గూడ కొత్తగా ఆయుధాలు నిర్మించడానికి యేర్పాటులు చేయించారు. ఈ ఆయుధ నిర్మాణ ప్రయత్నాలన్నీ నిర్వహించడానికి "డైరక్టరు జనరల్ ఆఫ్ మ్యూనిషన్సు" అను ఒక ప్రత్యేకాధికారిని నియమించారు. ఆయుధ నిర్మాణ శాలలలో అత్యధిక భాగం, కలకత్తా ప్రాంతంలో వుండుటచేత మ్యూనిషన్సు శాఖ డైరక్టరు జెనరలు యొక్క కచేరీ కలకత్తాయందే స్థాపించారు.

### విమాన నిర్మాణ శాలలు.

ఆయుధ నిర్మాణ పరిశ్రమలలో మొదట పేర్కొనవలసినది విమాన నిర్మాణము. విమానాలు నిర్మించి యొసగుట కొరకు ఈ దేశంలో ఒక పారిశ్రామిక సంఘంతో ప్రభుత్వంవారు ఒడంబడికచేసుకున్నారు. ఇటీవలనే ఈ దేశంలో మొదటి విమాన నిర్మాణశాల నెలకొల్పబడింది. దానిలో తయారు చేయబడిన మొదటి విమానమును గత జూలై మాసంలోనే ప్రభుత్వంవారికి అందచేశారు. ఈ యంత్రాలయమునకు కావలసిన వస్తు సామగ్రిలో చాల భాగము ప్రస్తుతం విదేశములనుండియే దిగుమతియగుచున్నను, క్రమంగా వాని నన్నిటినీ ఈ దేశంలోనే తయారు చేసుకొనుటకు సౌకర్యాలు యేర్పడును. ఒక్క ఇంజనులకు తప్ప, మరే వస్తువు కొరకు విదేశాల మీద ఆధారపడ నక్కరలేదు.

### నౌకా నిర్మాణ శాలలు.

ఈ దేశంలో నౌకా నిర్మాణశాలను నెలకొల్పే విషయమును గూడ ప్రభుత్వంవారు జాగ్రత్తగా పరిశీలించారు. అట్టి నిర్మాణ శాల కొరకు అవసరమగు భూమిని విశాఖపట్నంలో, ప్రభుత్వంవారు, ఒక కంపెనీకి కవులుకు మంజూరు చేశారు. యుద్ధసమయంలో నౌకా నిర్మాణ పరిశ్రమల నెలకొల్పడానికి చాల చిక్కులున్నాయి. నౌకలకు కావలసిన ఇంజనులను ఈదేశంలో తయారు చేయుట కష్టం. అవిగాక, నౌకలకు కావలసిన మేలురకపు ఉక్కుగూడ అమెరికావంటి విదేశాలనుండియే రావలసివుంది. వీలైనంత వరకు వీనిని అమెరికా నుండి దిగుమతి చేయుటకు అవసరమగు సౌకర్యములను ప్రభుత్వంవారు సంపాదించి పెట్టి తోడ్పడుచున్నారు.

అవిగాక చిన్న చిన్న నౌకలను, ట్రాలరులు మొదలగు చిన్న యుద్ధనౌకలను నిర్మించడానికీ దేశంలో ఇదివరకే సౌకర్యాలున్నాయి. కలకత్తా మొదలగు ప్రదేశాలలో ఇదివరకే ఇట్టి నౌకలు నిర్మింపబడుచున్నవి. బ్రిటిషు ప్రభుత్వ నౌకాశాఖవారికి, "నీళ్లలోతేలు నౌకా నిర్మాణపు" శాలలను నిర్మించి యొసగుటకుగూడ ఒప్పందము జరిగినది. చిన్న నౌకల నిర్మించుట పెద్ద నౌకలకు మరమ్మతులుచేయుట మొదలగుపనులను చేసే కంపెనీలు, కలకత్తా, బొంబయి, కరాచీ మొదలగు పట్నాలలో ఇదివరకే వ్యాపారం సాగిస్తున్నాయి.

### టాంకులు, సకవచ శకటములు.

కొన్ని వేల మోటారు బండ్లను నిర్మించి యిచ్చుటకిదివరకే ఒడంబడిక వుంది. వీనిలో సుమారు 50 రకాల వరకును వున్నవి. కొన్ని ప్రత్యేక కారణాలవలన వీని వుత్పత్తి, సప్లైలకు బొంబయి రాజధాని కేంద్రంగా వుంటుంది.

1941 వ సంవత్సరం చివరి భాగంలో ఇచటనుండి బండ్లను చేరవేయుటకు రైలుబండ్లు చాలక, ఈ మోటారుబండ్లను రోడ్డుమీదుగానే సైనిక నిలయాలకు నడుపుకొని పోవలసివుంటుంది. సంగ్రామానికి పూర్వం, భారత సైనిక శాఖకు 5,000 మోటారు బండ్లుండేవి. ఇపుడు 60 వేల బండ్లు పనిచేస్తున్నాయి.

సంగ్రామానికి పూర్వం, ఉక్కుకప్పుగల ఫిరంగి మోటారులు, టాంకులు అన్నీ విదేశాలనుండి దిగుమతి అయ్యేవి. ఇపుడు టాంకులకు కావలసిన దుర్భేద్యమగు వుక్కును, ఈ దేశంలోనే టాటా కంపెనీవారు తయారుచేస్తున్నారు. దీనితో

టాంకులు ఇతర "సకవచ శతఘ్ని శకటము"లు ఈ దేశంలోనే తయారగును. ఈ సంవత్సరాంతం లోగా అధమం 3,000 టాంకులైనా తయారగునని తలుస్తున్నారు.

### ఫిరంగులు, మందు గుండు సామాగ్రి.

యుద్ధారంభంలో, ప్రభుత్వంవారి, ఆయుధ నిర్మాణ శాలలలోను, మందుగుండు ఫాక్టరీలలోను 17,000 మంది పనిచేస్తుండేవారు. ఇపుడు వీరిసంఖ్య 49 వేలకు పెరిగింది. ఈ సంఖ్య ఇంకా త్వరితంగా పెరుగుచున్నది. రూ. 4 కోట్లు వెచ్చించి ఇదివరకున్న ఆయుధ నిర్మాణశాలలను అభివృద్ధి పరచారు. ఫిరంగులు, మరఫిరంగులు, తుపాకులు, ఫిరంగి గుండ్లు మొదలగునవన్నీ ఈ దేశంలోనే తయారగుచున్నవి. విమానాలను పడగొట్టు ఫిరంగులు, టాంకుల భేధించు ఫిరంగులుగూడ విరివిగా వుత్పత్తి అగుచున్నవి.

### ప్రైవేటు ఫ్యాక్టరీలు.

ప్రభుత్వంవారి ఫ్యాక్టరీలలోనే గాక, ఇతర ప్రైవేటు కర్మాగారములనుగూడ ప్రభుత్వంవారు తుపాకులు, మందు గుండు మొదలగు ఆయుధ నిర్మాణ కార్యాల కుపయోగిస్తున్నారు. 4.5 అంగుళాల హావిట్జరు ఫిరంగులు, 25 పౌనుల తూకంగల ఫిరంగి గుళ్ళు రైల్వే కర్మాగారములలో తయారగుచున్నవి. ఈ విధంగ అచిరకాలంలోనే, ఆయుధ పరికరాలన్నిటిలోను భారతదేశాన్ని స్వయం సమృద్ధిగా చేయుటకు ప్రయత్నాలు జరుగుచున్నవి.

230 ప్రైవేటు వర్కుషాపులు, 23 రైల్వే వర్కుషాపులు, 20 వేల రకముల ఆయుధాలను పరికరములను ప్రస్తుతం తయారుచేస్తున్నాయి. సంగ్రామపూర్వంకంటె ఇపుడు ప్రభుత్వంవారి ఆయుధ నిర్మాణ శాలలలో 5 రెట్లు ఎక్కువ ఆయుధములు ఉత్పత్తియగుచున్నవి. ఫిరంగిగుండ్ల ఉత్పత్తి 24 రెట్లు హెచ్చినది.

---

# హిట్లరు—స్టాలిను—చర్చిల్.

## ముగ్గురూ చెప్పిన విషయాలు.

### ఇంగ్లాండు విమాన శక్తి హెచ్చింది; హిట్లరుతో ఎన్నడు రాజీపడదు.

ఈ వారంలో ముఖ్యమగు ప్రకటనలు చాలా చేయబడ్డాయి. 1923 వ సం॥లో తమ నాజీ పార్టీ ప్రారంభింపబడిన దినంయొక్క వార్షిక సభయందు ఉపన్యసించుచు జర్మను నియంత హిట్లరు ఉపన్యాసం చేసేడు. ఇదివరకువలె యీ ఉపన్యాసం రేడియోలలో అన్ని దేశాలకు వినిపింపలేదు. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క రీతిగా ఆ ఉపన్యాసం ప్రకటింపబడింది. అంటే అతడు అన్ని విధాల మార్చవలసివచ్చిందన్న మాట. మామూలువలె ఆ ఉపన్యాసం ప్రగల్భాలతో నిండియున్నది. బ్రిటిషువారు తనతో రాజీకి రాలేదని వారిని హిట్లరు తిట్టెను; యూదులను సరేసరి; రష్యా నష్టాలను అతిశయోక్తులుగా చెప్పెను. యూరోపులో తాను తలపెట్టిన క్రొత్త విధానానికి తనచే ఓడింపబడి బానిసలుగావున్న దేశాలన్ని అంగీకరించాయన్నాడు. జర్మనీచావు బ్రతుకులలోవుంది, బ్రతకాలంటే యీ యుద్ధంలో గెలువక తప్పదని జర్మను ప్రచురణ శాఖమంత్రి యిదివరకే అనియుండెను. జర్మనీ ఎంత నిరాశ చెందుతున్నదో దానివల్ల తెలియగలదు. యుద్ధంలో బ్రిటిషువారికనుకూలంగా దశ తిరిగిపోయింది.

రష్యానియంతయగు స్టాలిను శుక్రవారంనాడు మాస్కో నగరంలో ఉపన్యశించుచు హిట్లరు చివరకు ఓడిపోతాడనుటకు ఎట్టి సందేహం లేదనెను. రష్యాకు యుద్ధ విమానాలు టాంకులు తక్కువగా వున్నాయని అంగీకరించి బ్రిటను అమెరికాలు సహాయం చేయగలవని నమ్మకం వెలిబుచ్చెను. రష్యా ప్రజలకు ఎక్కువ ఉత్సాహం కలిపించుటకు స్టాలిను ఉపన్యాసం తోడ్పడగలదు.

బ్రిటిషు ప్రధాన మంత్రియగు చర్చిల్‌గారు లండనులో మేయరుగారి విందులో ఉపన్యాశించుచు తాము తప్పక విజయం పొందగలమను ఆశ ప్రకటించిరి. ఇంగ్లాండు ఒంటరిగా యుద్ధం చేయవలసి వచ్చినా హిట్లరుతో మాత్రం సంధికి దిగదని చెప్పిరి. జపాను తొందరపడి దుష్ట కార్యాలకు దిగకుండా హెచ్చరించిరి. అమెరికా జపానుతో యుద్ధం ప్రకటించిన ఘంటలో ఇంగ్లాండుకూడ యుద్ధం ప్రకటించగలదని చెప్పిరి. అంతకన్న ముఖ్యమైన విషయం ఏమంటే, ఇంగ్లాండు విమానదళం జర్మనీ విమానదళంతో సరిసమానమైందని, నౌకాదళంచాల పెంచబడిందని, బ్రిటిషు సైన్యాలు అట్లాంటికు మధ్యధరా సముద్రాలేగాక, హిందూ మహా సముద్రం, పశిఫికు సముద్ర తీరాలుకూడ చేరగల్గుతున్నాయని చర్చిల్‌గారు ప్రకటించేరు.

### హిట్లరు ఉపన్యాసం.

హిట్లరు ఉపన్యాసంలో ముఖ్యమైన విషయాలేమంటే, రష్యా సైనికులు 3,600,000 మంది జర్మనీచే ఖైదుచేయబడిరని, మొత్తం 80 లక్షలు లేక కోటిమంది సైనికులను రష్యా నష్టపోయిందని, 15,000 విమానాలు, 22,000 టాంకులు, 27,000 ఫిరంగులు గోల్పోయిందనియు చెప్పెను. రష్యాదేశంలో చాలభాగం తాము ఆక్రమించామనియు, ముఖ్యాంశమైనటువంటి పరిశ్రమలను పడగొట్టి ముడిపదార్థాలను తీసుకున్నామనియు చెప్పెను. అమెరికా స్టీమరులు కనబడగానే వాటిపై ప్రేల్చరాదనియు, అవి ముందు ఫిరంగులు ప్రేలిస్తేనే జర్మను స్టీమరులు వాటిపై ప్రేల్చాలని వుత్తరువు చేసెననియు హిట్లరు చెప్పెను. దక్షిణఅమెరికాను ఆక్రమిస్తాడని, మతాలులేకుండా చేస్తాడని తన్నుగురించి అధ్యక్షుడు రూజువెల్టు చెప్పిందంతా శుద్ధ అబద్ధం, అసందర్భం అని హిట్లరనెను. "ముసోలిని నేను స్నేహప్రమాణాలు చేసుకున్నాం. మా సఖ్యతను ప్రపంచంలో ఏ శక్తి చెడగొట్టలేదు. నేడు యూరోపులో ఎక్కువభాగం మాపక్షంవుంది. యూరోపు పరిస్థితులు యింక వెయ్యేళ్ళవరకు మారకుండా వుంటాయి. లెనిన్గ్రాడు నగరం ముట్టడిలోవుంది, త్వరలో జర్మనులవశమగును. అందలి పరిశ్రమలను నాశనంచేయడమే మా వుద్దేశం. ఆపని రష్యనులేచేస్తే మాపని తగ్గిపోతుంది. ప్రపంచమంతకు ముఖ్యపట్నంగా ఉండాలని బెర్లిను నగరం కోరడంలేదు." అని హిట్లరు తెలిపెను.

### స్టాలిను ఉపన్యాసం.

రష్యా పాలకుడగు స్టాలిను ఏమిచెప్పినాడంటే జర్మనీలో పరమదరిద్రంగావుంది. 45 లక్షలమంది జర్మను సైనికులు చనిపోయినారు; జర్మనీ సంపదంతా చెడి, తిండిలేక జర్మనీ ఆక్రమించిన దేశాలలోనేగాక జర్మనీలోనే తిరుగుబాటు ఎక్కువగుచున్నది. రష్యాపై యుద్ధానికి ఇంగ్లాండును పురిగొల్పాలని హెసుగారిని ఇంగ్లాండు పంపిరి గాని లాభం లేకపోయింది. రష్యా వైమానికులు, టాంకుదళాలు అద్భు

తంగా పనిచేస్తూ జర్మనులను మించిపోతున్నాయి. కాని విమానాలు టాంకుల సంఖ్య జర్మనీకన్న రష్యాకు తక్కువ. ఆయుధాలు ఎక్కువ ఉత్పత్తిచేయవలెను. ఇంగ్లాండు అమెరికాలు రష్యాతో కలసి జర్మను సామ్రాజ్యకాంక్షను అణచివేయాలని ప్రయత్నించుచున్నాయి. రష్యాకు తక్కువైన లోహములు ముడిపదార్థాలు విదేశాలనుండి విశేషంగా వస్తున్నాయి. అమెరికా రష్యాకు నూరుకోట్ల డాలరుల ఋణం యిస్తున్నది.

“మా దేశంలో కాలుపెట్టిన ప్రతి జర్మనీవానిని నిర్దాక్షిణ్యంగా చంపివేస్తాము. జర్మనుసైన్యాల వెనుకనుండు ప్రజల నైతికబలం నాశనమయి, యూరోపులో హిట్లరు తలపెట్టిన నూతనవిధానం నిరర్థకమయినపుడే హిట్లరు తత్వం మూలచ్ఛేదం కాగలదు. సోషలిజానికి హిట్లరుసైన్యాల పశుత్వానికి ఎట్టి పోలిక లేదు. అదివరకు జర్మనీ పోగొట్టుకున్న రైనులాండు, ఆస్ట్రియాలను తిరిగి జర్మనీతో చేర్చుకొనుటకు ప్రయత్నించినపుడు హిట్లరు అనుచరులు కొంతజాతీయవాదులనిపించుకున్నారు. కాని యిప్పుడు యూరోపు దేశాలన్నింటిని బానిస దేశాలుచేసి ప్రపంచాధిపత్యంకోసరం తంటాలు పడుచు! దోచుకోడం ప్రారంభించినాక, హిట్లరు అనుచరులు జాతీయవాదులు కానేకారు; దోపిడిగాండ్రు సామ్రాజ్యదాహంగలవారవుతారు. యూరోపులో కార్మికుల సర్వహక్కులను సౌకర్యాలను జర్మనులు నాశనం చేస్తున్నారు. ఇంగ్లాండు, అమెరికాలు యూదుల ప్రాబల్యంగల ధనికవర్గాలతో నిండినవని హిట్లరు తిడతాడు. కాని ఇంగ్లాండు అమెరికాలలో కార్మికులకు ప్రాథమిక హక్కులు, సంఘాలుగా ఏర్పడి స్వంత అభివృద్ధికి పాటుబడే స్వాతంత్ర్యం ఉన్నాయి. హిట్లరు అధికారలలో అవిలేవు. రష్యాలో విప్లవం జరక్కముందు జారు రాజుల పరిపాలన క్రిందనున్న పరిపాలనే హిట్లరు పరిపాలన. హిట్లరు పక్షంవారు ప్రజాస్వాతంత్ర్య విరోధులు; కపటసన్యాసులు క్రూరులు.” అని స్టాలినుగారన్నారు.

## చర్చిల్ పలుకులు.

బ్రిటిషు ప్రధాని చర్చిల్‌గారి ఉపన్యాసంలో ముఖ్యవిషయాలేమంటే :— “పోలెండు ఆక్రమణతో హిట్లరు ప్రారంభించిన యుద్ధం నేడు యూరోపును ముంచివేసింది. ఆశియాలో ఎక్కువ భాగాన్నిగూడ ఆక్రమించగలదు, ప్రపంచంలో మిగిలియున్న నాల్గో భాగానికికూడ వ్యాపించగలదు. జర్మనీ ఆక్రమించిన నార్వే, బెల్జియం, హాలండు, పోలెండు, జెకోస్లావాకియా, ఫ్రాంసు మున్నగు యూరోపు దేశాలన్నింటిలోను జర్మనీ అధికారంపై ప్రజలు తిరుగబడుతూవుంటే వందలు వేలు దేశీయులను జర్మను సైనికులు చంపేస్తున్నారు. ఫ్రాంసులో పగ సాధించుటకై బందీలను, యిట్లాగే చనిపోయిన ఒక జర్మను దేశీయునకు 50 మంది ఫ్రెంచివారు చొప్పున చంపుతూవుంటే ప్రపంచమంతా యీ దారుణ చర్యకు నిరసనందెలిపి, ఛీఛీ అంటే హిట్లరువంటి క్రూరుడుకూడ భయపడి, అట్టి చర్యలు తగ్గించాడు. ఈ రీతిగ అతనిచే చంపబడుతున్నవారంతాగూడ యుద్ధరంగంలో ప్రాణత్యాగం చేసిన సైనికులవంటి త్యాగం చేసినవారే అవుతారు. యూరోపు దేశాలలో యిపుడు రక్తపు నదులు పారుతున్నాయి. కాని అందలి రక్తం యుద్ధరంగంలో చచ్చిన వీరుల రక్తంకాదు. పైన చెప్పిన బందీల దేశీయుల హత్యలచే ప్రవహించు రక్తం. ఈ పాపం జర్మనుల కెన్నో తరాలవరకుపోదు. యూరోపులో హిట్లరు తలపెట్టిన క్రొత్త విధానానికి యిదే అంకురార్పణ. ఇటువంటి పద్ధతులతోనే ప్రపంచాన్నంతా హిట్లరు ఏలాలని చూస్తున్నాడు.

రష్యాజాతి అంతా తిరుగబడి జర్మనీ సైనిక శక్తిని అణచివేస్తున్నది. బ్రిటిషువారి విమానాల శక్తి ఎలాగూ జర్మను విమానాల శక్తికన్న ఎక్కువే. ఇపుడు జర్మనీ కెన్ని విమానాలున్నాయో ఇంగ్లాండుకుకూడ అన్ని ఉన్నాయి. మధ్యధరా సముద్రంలో జర్మను ఇటలీ సప్లయి స్టీమరులను బ్రిటిషు విమానాలు ముంచేస్తున్నాయి. ఆ సముద్రంలో బ్రిటిషు స్టీమరులు స్వేచ్ఛగ తిరుగుతున్నాయి. సముద్రాధిపత్యం బ్రిటిషువారిదేయని రుజువయింది. ఇపుడు హిందూ మహాసముద్రం, పశిఫికు సముద్రాలలోగూడ బ్రిటిషు స్టీమరులను రక్షణ యివ్వగలుగుతున్నాము. ఇండియాదేశం సైన్యాలు ఆఫ్రికా యుద్ధంలో చాల ప్రతిభ చూపినవి. ఆ దేశ ప్రజలకుగూడ యిపుడు మేము సైనిక రక్షణ ఇవ్వగలం, ఆస్ట్రేలియా, న్యూజిలండులకుగూడ తోడ్పడగలం.

## జాపాను సాహసింపజాలదు.

పశిఫికు సముద్రమునందు అమెరికాయొక్క రాజ్యంవుంది. అమెరికాకు అక్కడ ఎంతో బాధ్యతవుంది. అచట యుద్ధం జరుగకుండా శాంతి కాపాడుటకే అమెరికా చాల ప్రయత్నం చేస్తున్నది. ఆ ప్రయత్నమే ఫలించకపోయి, అమెరికా జాపానుతో యుద్ధంచేయవలసివస్తే, ఇంగ్లాండు కూడమరుక్షణంలో యుద్ధానికి దిగుతుందని చర్చిల్‌గారు ప్రకటించారు.

జాపాను అనవసరంగా యీ యుద్ధంలో దిగితే, ప్రపంచం మొత్తం జనసంఖ్యలో ముప్పావువంతు జనసంఖ్యగల దేశాలన్నింటిని ఎదిరించవలసియుండును. అంతసాహసం జాపాను ప్రజలు చేయజాలరు. యుద్ధానికి మూలసాధనం ఉక్కు. ఆ ఉక్కు జాపాను సాలీనా 70 లక్షల టన్నులు తయారుచేయగలదు. అమెరికాలో 900 లక్షలు ఉక్కు తయారవుతుంది. పైగా బ్రిటిషు సామ్రాజ్యమంతా అమెరికాకు తోడ్పడుతుంది. కావున జాపానులో తెలివైన కొందరు రాజనీతిజ్ఞులు చెప్పినట్లు పశిఫికు ప్రాంతముల శాంతిభంగం కలుగదనే ఆశించుచున్నాను. కాని అవసరమయితే అచట బ్రిటిషు హక్కులన్ని రక్షించుకొనుటకు సర్వప్రయత్నములు చేయబడుతున్నాయని చర్చిల్‌గారు తెలిపిరి.

చీనా ప్రజలు ఐదేండ్లగా ఒంటరిగా యితరుల సహాయం లేకుండా తమ స్వాతంత్ర్యం కాపాడుకొనుటకై చియంగుకాయి షేకు సేనాని నాయకత్వంతో జాపాను సేనలను ఎదిరించి పోరాడుచున్నారు. వారి అద్భుత పరాక్రమ చర్యలను చూస్తే ఉద్రేకం కలగక మానదు. చీనాజాతి అంతా తమ యిండ్లు వాకిళ్లు కాపాడుకోడానికి జాపానుదాడిని నిరోధించుచున్నది. వారి నిరోధం విజయంకాకపోతే ప్రపంచ నాగరికతకే గొప్ప ముప్పు వస్తుంది.

జర్మనీ సంధిసూచనలు చేస్తుంటంటున్నారు. తటస్థ దేశాలలో యీ ఎత్తులు పుట్టుచున్నాయి. వీటన్నింటికి ఒకటే అర్థం. ప్రపంచాన్ని యీ నరకంలో ముంచుచున్న పాపి, తనదోపిడి సొత్తుతోకూడ యీ నరకంలోనుండి తప్పించుక పారిపోవడానికి చేస్తున్న ఎత్తులివి. మాకు యితరుల సహాయం ఉన్నా, లేకున్నా, ఎంత కష్టాలు వచ్చినా యికముందు రానున్నా, బ్రిటిషు ప్రజలును ప్రభుత్వమున్ను వలస రాజ్యాల ప్రభుత్వములున్న హిట్లరుతోగాని, జర్మనీలో నాజీ పక్షముతరఫున వచ్చు యితరులతోగాని రాజీరాయబారాలకు అంగీకరింపరు, అవి స్పష్టంగా యీ సమయమున చెప్పక తప్పదు అని చర్చిల్‌ప్రధాని ప్రకటించెను.

# బ్రిటిషు సైన్యంలో ముందు నడచుబండ్లు.



బ్రిటీషు సైన్యం దాడిచేయునప్పుడు ముందుగా కొన్ని ఆయుధ మోటార్లు పోయి శత్రువు కనబడగానే ఎదిరించి, వెనుకనుండు తమ పెద్ద సైన్యం కలిసేవరకు పోరు సాగిస్తూవుంటాయి. అట్టి మోటారు వేగుల దళమునకు మంచి శిక్షణవుండవలెను. అటువంటి మోటార్లు ఎత్తైన కొండ నెక్కుటయందు కనబడును.

## అమెరికా ముందడుగు వేయుట.

### తటస్థ చట్ట నిరోధం తొలగిపోయింది.

యూరోపులో జరిగేయుద్ధాలలో చేయిచేసుకొని తాను నష్టానికి కష్టానికి పాలుకాకుండా వుండడానికి 1935 వ సంవత్సరములోనే అమెరికా శాసనసభలో తటస్థ చట్టం ఒకటి చేయబడింది. దానిలో ఎన్నో కఠిన నియమాలున్నాయి. అవివుండే యుద్ధంలో జర్మనీకి ప్రతికూలంగా ఉన్న దేశాలకు అ[illegible]రికా పూర్తిగ సహాయం చేయడానికి వీలు లేకుండా వుంది. అందుచేత యీ వారంలో అమెరికా ఉన్నత శాసనసభయందు ఆనిరోధాలు తొలగించే చట్టం ఒకటి 5[illegible]—37 వోట్లతో అంగీకరించబడింది. ఈ విధంగా అమెరికా చొరవచేసుకొని ముందుకు పోతున్నది. ఇంక అమెరికానుండి ఆయుధాలు, ఆహార పదార్థాలు ఇంగ్లాండు రష్యాలకు యధేచ్ఛగా రావచ్చును.

యుద్ధం చేస్తున్న దేశాలకు అరువులిచ్చి, సరకులు పంపించుటవలనను, అమెరికా స్టీమరులు ముంచివేయబడుట చేతను, గత యిరోపా యుద్ధంలో అమెరికా చివరకు యుద్ధంలో దిగవలసి వచ్చింది. ఈ సారి అట్లా జరగకూడదనే వుద్దేశంతో, 1935 లో యూరోపులో వివిధ దేశాలమధ్య వైషమ్యాలు ఏర్పడుతూ వుండగానే, అమెరికాలో తటస్థ చట్టం చేయబడింది. దాని ప్రకారం యుద్ధం చేస్తున్న దేశాలకు అమెరికాలో ఏ కంపెనీయు ఆయుధాలు సప్లయి చేయరాదు. ఇతర సామానులు నగదుకు విక్రయించవచ్చును. కాని కొనే దేశాలు అమెరికాకువచ్చి తమ నావలలోనే ఆసామాను అట్లాంటిక సముద్రం దాటించి తమ దేశాలకు తీసుకపోవాలని విధించబడెను. ఈ నియమాలు హిట్లరు దౌర్జన్యాన్ని ప్రోత్సాహించేయే కాని తగ్గించలేవు. యుద్ధ సమయంలో అమెరికానుండి ఇంగ్లాండు ఫ్రాంసులకు ఆయుధసామగ్రి రాదని జర్మనీకి నమ్మకం కలిగింది.

రూజువెల్టు అధ్యక్షునకు దూరదృష్టి యెక్కువ. ఆయుధాల ఎగుమతి నిరోధం తొలగిస్తేగాని ఇంగ్లాండుకు లాభించదని తెలిసి 1939 లో నే తొలగించమని అమెరికా శాసనసభను కోరెను. కాని వారు ఆ నియమాలను కొద్దిగానే తొలగించారు. నేటి యుద్ధం ప్రారంభం కాగానే అధ్యక్షుడు శాసనసభ ప్రత్యేక సమావేశం యేర్పాటుచేసెను. ఆ సభలో కొన్ని వారాలు చర్చ జరిగినతరువాత, 1939 వ సం॥ నవంబరులో ఆయుధాల నిషేధం నియమాలు తొలగించబడ్డాయి. ఆ సవరింపు ప్రకారం, యుద్ధంలో దిగిన దేశాల పేర్లను అధ్యక్షుడు ప్రకటించగానే, ఆ దేశాలకు నగదుకు ఆయుధాలు మందు గుండు యుద్ధ పరికరాలు యితర సామానులన్నీ కూడ అమెరికావారు విక్రయించవచ్చు. కాని కొనేదేశాలు వాటి నావలపైనే తీసుకపోవలెను. యుద్ధపు దేశాలకు అరువు యివ్వరాదు, ఆదేశాల ప్రభుత్వ ఋణపత్రాలు అమెరికావారెవ్వరు కొనరాదని

నియమంగలదు. అమెరికా నౌకాలుగూడ యుద్ధపు దేశాల తీరాలకు పోరాదని నిషేధింపబడెను. ఇంగ్లాండు దీవులు, ఫ్రాంసు, బెల్జియం, హాలెండు, జర్మనీ స్కాండినేవియా దేశాలు యుద్ధ రాజ్యాలుగ ముందుగ ప్రకటించబడెను. చీనా దేశంతో జాపాను యుద్ధం ప్రకటించకుండానే పోరాడుచున్నది. కావున చీనాకు అమెరికా ఆయుధాలు పంపడానికి యీ చట్టం అడ్డురాలేదు.

మిత్రమండలి దేశాలకు బాగా డబ్బుంది కనుకను, నౌకలు ఎక్కువగా వున్నాయి కనుకను యుద్ధపరికరాలను నగదిచ్చికొని తీసుకపోయే నియమం వాటికి చాల లాభించింది. జర్మనీకి ఆ సదుపాయాలు లేవు. కనుక లాభించలేదు. అయినా ఇంగ్లాండు నౌకలను జర్మనీ విమానాలు సబుమైరెనులు యుద్ధనౌకలు దారికొట్టడం వల్లను, ఫ్రాంసు జర్మనీవశమవడం, ఇటలీ జర్మనీపక్షం చేరడం, జపాను సఖ్యతగ లేకపోవడం, యిలాటి కష్టాలవల్ల అమెరికానుండి సరకుతెచ్చు బ్రిటిషు నౌకలకు యుద్ధనౌకల సహాయం తగినంత యివ్వడం కష్టంగావుండెను. అందుచే అమెరికా ప్రజలు క్రమేణ యీ కష్టమును, తమ బాధ్యతను గుర్తించిరి. అందుచే గత మార్చి మాసంలో అరువుకౌలు చట్టం అమెరికా శాసన సభ ఆమోదించెను. యుద్ధం చేస్తున్న దేశాలలో అమెరికా దేశీయులు డబ్బుమదుపు పెట్టరాదు, ఆ దేశాలకు అరువులివ్వరాదను నిషేధమును అరువుకౌలు చట్టం తొలగించెను. అమెరికా స్టీమరులు సరకును ఇంగ్లాండునకు తీసుకపోతూవుంటే, జర్మను స్టీమరులు వాటిని ముంచేయాలని హిట్లరు ఉత్తరువు చేసెను. దానికి జవాబుగ జర్మను యుద్ధ నౌకలుగాని, సబుమైరెనులు కాని కనబడగానే ముంచేయాలని అధ్యక్షుడు రూజువెల్టు తన నౌకలకు ఆజ్ఞాపించాడు. ఈ నౌకల ముంపు యుద్ధం అట్లాంటికు సముద్రంలో జరుగుతూనేవుంది. అమెరికా స్టీమరులు ఏయే సముద్రాలలో పోవాలో ఆ సముద్రాలన్నింటిలో యిట్లే జరుగుతున్నది. ఇపుడు రష్యాకు అమెరికా సామానులు ఎక్కువగా పంపవలసియుంది. అమెరికా వర్తక నౌకలకు యుద్ధనౌకలుతోడుగా పోతూ వుండడంకంటే, అమెరికా వర్తక నౌకాలకే ఫిరంగుల మర్చడం మేలుగా కనబడింది. ఇదివరకలా చేయరాదని తటస్థ చట్టంలో నిషేధంగలదు. అమెరికా నౌకలు యుద్ధ రాజ్యాల రేవులకు పోరాదనికూరా నిషేధం కలదు. ఇపుడు రష్యా ఇంగ్లాండులకు సహాయం ఎక్కువ చేయాల్సివుంది కనుక, అమెరికా శాసనసభ ఆ రెండు నిషేధాలను తొలగించుచు యీ వారంలో ఒక చట్టంచేసింది. ఇది చాల ముఖ్యమైన నిర్ణయము. దీని ద్వారా ఇపుడే యుద్ధంలో అమెరికా బాధ్యత ఎక్కువైంది. దక్షిణాఫ్రికా సేనాని స్మట్సుగారు చెప్పినట్లు యీ చట్టం హిటరుకు ఉరిశిక్షవంటిదే.

---

# ఈ వారంలో యుద్ధ వార్తలు.

## బర్లినుపై బ్రహ్మాండమగు దాడులు.

ఇంగ్లాండునుండి బయలుదేరుచున్న బ్రిటిషు యుద్ధవిమానాలు గడచిన మూడు నెలలలోను, జర్మనీమీద, జర్మనీచే ఆక్రమింపబడిన దేశాలమీద 10 వేల టన్నుల బాంబులు వర్షించినవి. వీనిలో అత్యధికభాగం జర్మనుపట్నాలమీదనే ప్రయోగింపబడ్డాయి. ఈ దాడులలో 80 శత్రు నౌకలు ముంచబడినవి. ఈ నెల 5 వ తేది వాతావరణం అనకూలముగా లేకపోయినా, ఐరోపా కోస్తారేవులమీద బ్రిటిషు విమానాలు పెద్ద దాడిని సాగించాయి. ఈ దాడులనుండి ఎనిమిది విమానాలు తిరిగిరాలేదు. 6 వ తేదీ రాత్రి జర్మనీలో వాయవ్యప్రాంతమునగల పెద్ద పారిశ్రామిక పట్నముల మీద తీవ్రమైన దాడినే జరిపినవి. జర్మనురేవులలోవున్న కొన్నివందల కొయ్య ఓడలు ముంచివేయబడ్డాయి. ఈ దాడులనుండి నాల్గు విమానాలు తిరిగిరాలేదు.

8 వ తేది రాత్రి మాత్రం అనేకవందల బ్రిటిషువిమానాలు ఫ్రాన్సుమీదను జర్మనీమీదను బ్రహ్మాండమగు దాడి సాగించి అనేక పట్నాలలోని ఫాక్టరీలను రైల్వేజంక్షనులను పరశురామ ప్రీతికావించినవి. ఒక ఫ్రార్సుమీద దాడి సాగించిన వాని సంఖ్యయే 300 కు తక్కువ వుండదు. అందులో జర్మనీరాజధానియగు బర్లినుమీద, బ్రిటిషు విమానాలారోజు దాడిలో జరిపినంత భీభత్సం, యుద్ధం ప్రారంభమైన లగాయతు ఇంతవరకెప్పుడు ఆ పట్నానికి సంభవించియుండదు. ఒకవైపున వురుములు మెరుపులతో తుపాను చెలరేగుచున్నా లక్ష్యపెట్టక, కొన్నివేల బాంబులను ఆ పట్నంమీద వర్షించాయి. ఆ రాత్రి దాడులన్నిటినుంచి 37 విమానాలు తిరిగిరాలేదు. జర్మను ఆయుధ నిర్మాణశాలలు గల ఎస్సెన్ మొదలగు పట్నాలమీద 9, 10 వ తేదీలలోగూడ మరల తీవ్రమగు దాడుల వరుసగా సాగించుచునేయున్నవి. 9 వ తేది దాడులనుండి ఎనిమిది విమానాలు తిరిగిరాలేదు గడచిన నెలలో అట్లాంటిక్ సముద్రంమీద బ్రిటిషు విమానాలు 101 శత్రు నౌకలను ముంచివేసినవి.

## బ్రిటనుపై దాడులు.

బ్రిటనుపై శత్రువిమాన దాడులు ఈ వారము చాలవరకు తగ్గిపోయెను. సాధారణముగ రోజుకు ఒకటి రెండిటికంటె యెక్కువ విమానములు దాడివచ్చుట లేదు. అవి వేసిన బాంబులవలన గల్గుచున్న నష్టముగూడ అత్యల్పము. 6 వ తేది రాత్రి ఒక శత్రువిమానము ఆంగ్లదేశమునందు ఆగ్నేయ భాగమున, అక్కడక్కడ బాంబులు వేసినవి. వీనివలన ప్రాణహాని విమాత్రమును కలుగలేదు. 7 వ తేదిన దక్షిణ-తూర్పు ప్రాంతములలో బాంబులచ్చటచ్చట పడినవి. 8 వ తేదిన బ్రిటనుపైకి వచ్చుచున్న విమానములు బ్రిటను తీరమును సమీపింపక పూర్వమే వానిలో ఒకటి పడగొట్టబడెను. ఆరాత్రిపడిన బాంబులవలన ఆస్తిగాక, ప్రాణనష్టము గూడ కొంత గల్గెను. 9 వ తేదిన పగలు శత్రువిమానములు బ్రిటను పైకి రానేలేదు. రాత్రిపూట కొన్ని విమానములు వచ్చెను. బాంబులవలన స్వల్పముగ ప్రాణనష్టముగూడ గలిగెను. 10 వ తేది పగలు శత్రువిమానములు ఒక్కొక్కటిగా వచ్చెను కాని యెక్కువ నష్టము గల్గింపలేదు.

## ఇటలీపై బ్రిటిషు దాడులు.

ఆఫ్రికా మధ్యధరా ప్రాంతములలో ఈవారం తీవ్రమగు పోరాటాలు జరుగలేదు. లిబియా (ఉత్తర ఆఫ్రికా) ఈజిప్టు సరిహద్దులలో శత్రువులు, ఇదివరకటికంటె జోరుగా గస్తీ సాగించి బ్రిటిషు సైనిక పంక్తులలో సుభేద్యమైన ప్రాంతాలను కనిపెట్టవలెనని చూస్తున్నారు. కాని, బ్రిటిషు సైన్యములు, శత్రువులు సమీపించినపుడెల్లా విశేషమగు నష్టం కలిగిస్తూ వెనుకకు తరిమివేస్తున్నాయి.

లిబియాయందు, శత్రులచే 7 నెలలుగా ముట్టడింపబడియున్న టోబ్రూకు దుర్గంవద్ద గస్తీదళముల సంఘర్షణలు దప్ప పెద్ద పోరాటాలు యేమీ జరుగుటలేదు. అబిసీనియాలో, గోండార్ ప్రాంతంలో ఇటాలియను సైన్యాలకు, బ్రిటిషు సైన్యాలు అబిసీనియా సైన్యాలు తొందరకలిగిస్తూ ముట్టడిని సాగిస్తున్నాయి.

సూయజుకాలువ ప్రాంతంమీద శత్రులు తిరిగి, విమానదాడులు సాగించారు. కాని ఎక్కువ విమానాలను పంపగల్గుటలేదు. శత్రుబాంబులచే గల్గిన ఆస్తి నష్టం తక్కువ. ప్రాణ నష్టం అత్యల్పం.

కాని బ్రిటిషు విమానాలు ఈవారం లిబియా తీరంలోని బెంఘాజీ, ట్రిపోలీ రేవులమీద, ఇటలీలోని రేవులమీద దాడులను చాల తీవ్రం చేశాయి. దీనివలన ఇటాలియనులు, లిబియాకు సైన్యాలను సప్లయిలను పంపుకొనుట దుస్సాధ్యం అగుచున్నది. ఈ విమానదాడులవలన, ఇటాలియనులలో చాల అలజడి, ముసులినీపైని ద్వేషం ప్రబలంగా వ్యాపిస్తున్నది.

ఇటలీపై దాడులిట్లుండగా, ఆఫ్రికాలో బ్రిటిషుసైన్యాలు, స్వతంత్ర ఫ్రెంచి సైన్యాలు యుద్ధం లేకుండా అద్భుతమగు మరియొక విజయం సాధించేటట్లున్నాయి. ఎర్రసముద్రం నుంచి, అబిసీనియా రాజధానియగు అడీస్ అబాబాకు వెళ్ళడానికి ప్రస్తుతం ఒక్క రైలుమార్గమే వుంది. అది ఫ్రెంచివారి సోమలీదేశంగుండా వెళ్లుచున్నది. ఆ దేశంలో ఫ్రెంచి అధికారులు, విషీప్రభుత్వం తరఫున వున్నారు; వారిని స్వతంత్ర ఫ్రెంచినాయకత్వాన్ని అంగీకరింపవలసిందని కోరితే నిరాకరించారు. అందుచే సంవత్సరం పైగా, బ్రిటిషు సైన్యాలు ఫ్రెంచి-సోమలీ దేశంలోకి ఆహారపదార్థాలను ప్రవేశింపనీయకుండా దిగ్బంధనం చేస్తున్నారు. ఈ దిగ్బంధనంవలన ఆహారపదార్థాలు లేక ఫ్రెంచి-సోమలీలాండు అధికారులు మిత్రమండలికి లొంగిపోవలసిన పరిస్థితులేర్పడుచున్నవని విషీ అధికారులే ప్రకటిస్తున్నారు.

## టర్కీ మధ్య ప్రాచ్యదేశాలు.

“కయనల్డరే” అను, టర్కీ ప్రభుత్వపు నౌక నల్లసముద్రమున ముంచివేయబడెను. అందలి సిబ్బంది సురక్షితముగనేయున్నారు. ఈ దౌర్జన్యము, తీరమునకు సమీపముననే, సముద్రమునందు టర్కీ సరిహద్దులలోనే సంభవించెను. దీనిని గురించి టర్కీ ప్రభుత్వము విచారణ జరుపుచున్నది.

ఈ నెల 6 వ తేదిన కాబూలునందు ఆఫ్గన్ ప్రజాప్రతినిధుల సమావేశము జరిగెను. ఆఫ్గన్ విదేశాంగమంత్రి ఆ సమయమున ప్రసంగించుచు ఆఫ్గనిస్థాన మీసంగ్రామమున తటస్థముగనుండుటకు నిశ్చయించుకొనెననియు, సంపూర్ణము తాటస్థ్యభావమును కొనసాగించుటకే ప్రభుత్వమువారు నిశ్చయించుకొనిరనియు వెల్లడించెను.

## రష్యా యుద్ధం.

రష్యా ప్రధానియగు స్టాలిను ఈవారం—రష్యను విప్లవపు 24 వ వార్షికోత్సవం సందర్భంలో ఉపన్యసిస్తూ—తాత్కాలికంగా, ఇంతవరకు జర్మనులు కొంతదేశం ఆక్రమించుకొనగల్గినా, త్వరలోనే జర్మను సేనలు నిర్మూలించబడి వెనుకకు కొట్టివేయబడగలవని ప్రకటించాడు.

రష్యా ఉత్తర రంగాలలో, ఫిన్నులు ఇంకా పోరాటాన్ని సాగిస్తూనే వున్నారు. కాని వీమాత్రం ముందుకు పోగలుగలేదు. లెనిన్‌గ్రాడు ప్రాంతంలో జర్మనులు కందకాలు త్రవ్వుకొని కూర్చున్నారు. ముట్టడివలన లెనిన్‌గ్రాడులోని సైన్యాలను లొంగదీయవలెనని జర్మనుల ప్రయత్నం. జర్మనులు లెనిన్‌గ్రాడునకు తూర్పుగా 100 మైళ్ళ దూరమున వున్న ఒక పట్నమును పట్టుకొన్నామని ప్రకటించుకొన్నారు. కాని రష్యనులు ఇంకా ఆవార్తను దృఢపరుపలేదు.

మాస్కో రంగంలో జర్మను లీవారం కొత్తగా ముందుకు రాగలుగలేదు. రష్యనులే తిరుగ దాడులు సాగించి శత్రుల నుకకు కొట్టుచున్నారు.

దక్షిణాన క్రైమియా ద్వీపకల్పంలో మాత్రం జర్మనులు చాల ముందుకు సాగిపోయి, దక్షిణ తీరం చేరగలిగిరి. శత్రుసైన్యాలిపుడు, క్రైమియాలో రష్యను నౌకా కేంద్రమగు సెబస్టపోలు రేవు దుర్గమును, తూర్పుతీరంలో వున్న కర్చి అను రేవును ముట్టడిస్తున్నారు. వీనినిగూడా ఆక్రమిస్తే క్రైమియా పూర్తిగా తమ స్వాధీనమగునని జర్మనుల వుద్దేశం.

## అమెరికా తయ్యార్.

అమెరికను వర్తక నౌకలకు ఫిరంగులను అమర్చుటకూ యుద్ధ ప్రాంతాలలోనికి గూడ అమెరికను నౌకలు ప్రవేశించుటకూ అనుమతినిస్తూ, అమెరికను సెనెటుసభవారు ఆమోదించిన చట్టం వారం పది రోజులలో ప్రజాప్రతినిధుల సభచేగూడ ఆమోదింపబడునని అమెరికను ప్రభుత్వాధికారులు సంపూర్ణమైన నమ్మకమును వెలిబుచ్చుచున్నారు. దానితో అమెరికను తాటస్థ్యం అదృశ్యమైపోతుందనీ మిత్రమండలికి పూర్తిగా అన్నివిధాలా సహాయం చేయడానికి వీలగుతుందనీ అనుకుంటున్నారు.

ఈలోగా అమెరికా ప్రభుత్వం, బ్రిటనుకు, రష్యాకు కావలసిన ఆయుధ సామగ్రిని, విమానాలను పంపిస్తున్నది. రష్యాకు 100 కోట్ల డాలర్లను, వడ్డీలేకుండా రుణమొసగుటకు అమెరికా ప్రభుత్వం వాగ్దానం చేసినది.

అమెరికా ప్రభుత్వంవారు, రష్యాపై వత్తిడిని తగ్గించడానికిగాను, ఫిన్లండును వెంటనే యుద్ధం మానుకొనవలసినదని, లేనిచో అమెరికాతో ఫిన్లండుకుగల సంబంధములు చెడిపోవునని హెచ్చరించారు. ఫిన్లండు ప్రభుత్వం తామిపుడు యుద్ధం విరమించుకొన వీలులేదని, ఫిన్లండు తన దేశరక్షణకు పోరాడుచున్నదేగాని, జర్మనీ ప్రోద్బలమున గాదనిజవాబిచ్చిరి.

## జపాను-అమెరికా విభేదాలు.

జపానుకు, అమెరికాకు గల విభేదాలను తొలగించుకొని అమెరికాతో యుద్ధం సంభవింపకుండ తప్పించుకోడానికి, జపాను ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. కాని ఈ విషయమై అమెరికాలోని జపాను రాయబారి అమెరికా ప్రభుత్వంతో సాగిస్తున్న సంప్రదింపులు ఇంకా ముగియలేదు. ఈ విషయంలో తుది ప్రయత్నం చేయడానికి జపాను ప్రభుత్వం పంపిన ఉద్యోగి వాషింగ్టను చేరిన నాలుగైదు రోజులకుగాని ఫలితం తెలియదు.

కాని, ఈ సంప్రదింపులు సఫలమయ్యే సూచనలు ఎక్కువగా కనుపించుటలేదని అనుకుంటున్నారు. జపాను అమెరికాతో యుద్ధం పెట్టుకుంటే, బ్రిటిషు సామ్రాజ్యమంతా గూడా మరుక్షణంలోనే, అమెరికాతరపున యుద్ధంలో దిగుతుందని బ్రిటిషు ప్రధాని హెచ్చరించాడు.

ఆసియా తూర్పు దేశాలకు గూడ యుద్ధం వ్యాపిస్తుందని థాయిలాండులో ప్రజలు అధికారులు భయపడుచున్నారు. ఏక్షణమైనా థాయిలాండు యుద్ధరంగంగా మారవచ్చుననీ, అందుచే సిద్ధముగ వుండవలసినదనీ, అధికారులు ప్రజలను హెచ్చరించారు.

జపాను ప్రభుత్వం, ఇండోచైనాలో తన సైన్యాలను హెచ్చించింది. ఇదివరకటికంటె ఇపుడచట మూడురెట్లు జపానుసైన్యం వున్నదనీ, ఇంకా వచ్చి దిగుచున్నదనీ, ఈ సైన్యంతో, చైనాలోని పడమటి రాష్ట్రాలమీద దాడి సాగించుట జపాను అధికారుల వుద్దేశమనీ, చైనా అధికారులు అనుమానిస్తున్నారు. ఈ రాష్ట్రాలమీదుగానే ప్రస్తుతం బర్మానుండి చైనాకు ఆయుధ సామగ్రి సప్లైలు అందుచున్నాయి. ఆ సప్లైలు అందకుండా జేయడం జపాను వుద్దేశం.

సోవియటు రష్యా, పసిఫిక్ సముద్రతీరపు రేవులవద్ద మాటుపెట్టిన మందుగని తగిలి ఒక జపాను నౌక ఈ వారం మునిగిపోయింది. ఈ విషయమై జపాను ప్రభుత్వం రష్యాకు తీవ్రమైన ఆక్షేపణ పత్రమును పంపినది.

## శత్రు నౌకలకు అపారనష్టం.

సముద్రములపై, ఈ వారము నౌకా పోరాటములు చాల అధికమైనవి. అట్లాంటికు సముద్రమున జర్మనులు ఇదివరకటికంటె చాల జలాంతర్గాముల నుపయోగించుచున్నారనియు, కెనడాతీరమువరకుగూడ అవివచ్చుచున్నవనియు, కాని కెనడా, అమెరికా బ్రిటను దేశముల యుద్ధనౌకలు—కనిపించినచోటనెల్ల ఈ జలాంతర్గాములను ముంచివేయుచున్నవనియు కెనడా దేశపు నౌకాదళాధికారి ప్రకటించెను.

బ్రిటిషు ప్రభుత్వపు "సింగలీస్ ప్రిన్సు" అను మోటారు ఓడ ఒకటియు, "కోసలీ" అను డిస్ట్రాయరు తరగతి చిన్న యుద్ధ నౌకయు మునిగిపోయెను. ఆ దాడిలో 7 జర్మను యుద్ధ నౌకలు ముంచివేయబడెను.

కాని గత మూడు మాసములలోను, అక్ష రాజ్యముల నౌకలు వందలకొలదిగ ముంచివేయబడెను. ఒక్క మధ్యధరా సముద్రముననే 86 నౌకలు బ్రిటిషు జలాంతర్గాములచే ముంచివేయబడెను. వీని పరిమాణము 339,000 టన్నులు. ఇవిగాక 267,000 టన్నుల పరిమాణంగల మరి 61 నౌకలు శిథిలము చేయబడెను.

అవిగాక, 9 వ తేదిన ఇటలీనుండి ఆఫ్రికా తీరమునకు యుద్ధ సామగ్రిని, సైనికులను తీసుకొనిపోవుచున్న పెద్ద ఇటాలియను నౌకలజట్టును, బ్రిటిషు యుద్ధ నౌకలు యెదిర్చి వానిలో 10 నౌకలను ముంచివేసెను. ఇటాలియను నౌకల వెంట ఒక "క్రూసరు" తరగతి యుద్ధ నౌకయు మూడు "డిస్ట్రాయరు" తరగతి యుద్ధ నౌకలునుగూడ కాపలా వెళ్లుచుండెను. వానిలో రెండు డిస్ట్రాయరు నౌకలు ముంచివేయబడెను. బ్రిటిషు నౌకలకు ఏమాత్రమును నష్టము కలుగలేదు. నల్లసముద్రమునందు 3,336 టన్నుల పరిమాణముగల మరియొక ఇటాలియను నూనె నౌక రష్యనులచే ముంచివేయబడెను.

## తటస్థ దేశాలు.

కొన్ని నెలల క్రిందట జర్మను జలాంతర్గామి ఒకటి, పోర్చుగలు దేశము సమీపముననే, ఆ దేశపు వర్తక నౌక నొకదానిని ముంచివేసింది. దీని విషయమై పోర్చుగలు ప్రభుత్వము ఆక్షేపింపగా, ముంచివేయబడిన నౌకకు బదులుగా పోర్చుగలు రేవునందున్న మరియొక జర్మను నౌకను, ఇచ్చుటకు జర్మను ప్రభుత్వం వాగ్దానంచేసింది.

జర్మనీ-ఇటలీల మధ్యనున్న స్విట్జర్లండు దేశమునందలి ఒక జిల్లాలో 7 వ తేదిన కొన్ని బాంబులుపడినవి. కాని నష్టము ఎక్కువ కలుగలేదు. స్విట్జర్లండు, ఐరోపాలో ఇంకను స్వతంత్రముగ నిలచియున్న చిన్న రాష్ట్రములలో ఒకటి.

ఐర్లండులో ఫ్రెంచి ప్రభుత్వ రాయబారి కార్యాలయమున వుంటున్న ఉద్యోగులు కొందరు రాజీనామా నిచ్చుటచేత మిగతా ఉద్యోగులు పెటెయిను సేనానికి రాజభక్తి ప్రమాణ మొనర్పవలెనని విషీ ప్రభుత్వము ఉత్తరువులను పంపినది రాయబారి కార్యాలయమందలి "సహాయ రాయబారి" దీనికి అంగీకరింపక తన పదవికి రాజీనామా నిచ్చెను.

గడచినవారము ఆఫ్రికా సమీపమున బ్రిటిషు యుద్ధనౌకచే పట్టుకొనబడిన ఫ్రెంచి నౌకలను విడుదల చేయవలసినదని విషీ యందలి ఫ్రెంచి ప్రభుత్వము బ్రిటనుకు ఆక్షేపణపత్రము నందజేసెను. సదరు నౌకలు శత్రులకు వస్తువుల తీసుకొని వెళ్లుచున్నవి గనుక వదలుటకు వీలులేదని బ్రిటిషు అధికారులు తెలిపిరి.

## ఆక్రమిత దేశాలలో జర్మను దౌర్జన్యాలు.

నాజీలు తమ ఆక్రమణయందున్న దేశాలలో తమ దేశ స్వాతంత్ర్యంకొరకుపోరాడుచున్న వారిని కమ్యూనిస్టులు అనే పేరుతోను, ఇతర ఆరోపణలతోను నిర్బంధములందుంచి హింసించుచున్నారు. రుమేనియాయందు నల్గురు మనుష్యులు "కమ్యూనిస్టు" చర్యలకుగాను సైనిక న్యాయస్థానంచేత వురి శిక్ష విధింపబడిరి. వీరిలో ఇద్దరు స్త్రీలు.

నార్వేయందలి ప్రజలకు సముద్రములోకిజని చేపల పట్టుకొనుటకు కుపయోగించు నౌకలు 1,700 కలవు. వానినన్నిటిని జర్మను అధికారులు స్వాధీనపరచుకొనిరి. నార్వే ప్రజలు అవకాశము లభించినపుడెల్ల ఆ నౌకలను ఉపయోగించుకొని ఆంగ్లదేశమునకు పారిపోవుచుండిరనియు అట్టిది సాధ్యము గాకుండచేయుటకుగాను యీ ఉత్తరువు గావింపబడెననియు జర్మను అధికారులు తెలుపుచుండిరి. బ్రిటిషు విమానదాడులచే సముద్రముపైకి పోవుటయే భయముగ నున్నదను కారణముచే చాలమంది తమ నౌకలను విక్రయించుకొనుచున్నారు. ఇకమీద నిటుల విక్రయించుకొనరాదనిగూడ జర్మను అధికారులు నిషేధించిరి.

ఫ్రాన్సునందు జర్మను ఆక్రమణయందున్న ప్రాంతములలో ప్రజలకును, జర్మనులకును వైషమ్యములు అధికమగుచున్నవి. జర్మను అధికారులు వీధిలో పోవుచుండు ప్రతి వ్యక్తిని వారివద్ద ఆయుధములు గలవేమోనని సోదా చూచుచున్నారు. ఇది ఫ్రెంచి ప్రజలలో చాల రోషాగ్రహముల కలుగజేయుచున్నది. ఇటీవల క్రైస్తవ మతాచార్యులను అరెస్టుచేయుటకు జర్మను అధికారులు ప్రారంభించిరి. ఇట్టి చర్యలవలన ద్వేషములు మరింత అధికమై—జర్మనులకు ఫ్రెంచి ప్రజలు ఎట్టి సహకారం చేయుటలేదు.

---

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.